ఎంత సుకవియైనను గూడ నీపై వాటిని వ్రాయఁజాలఁడు కదా. ఎవరికైనను మనసులో నభిప్రాయములు గల్గుచుండును. అందుఁ గొన్నిటిని మాత్రమే బాహ్యాకారములు వ్యక్తము చేయుచుండును. వీటినన్నిటిని వివరింపకుండుటయు నొకలోపమే యగును గదా. కావ్యములందుఁ గవి వీటినిఁ దనస్వంతమగుమాటలతోఁ దెల్పవలసియున్నది. దృశ్యకావ్యములందుఁ గూడ మనోభావములన్నియుఁ దెలియఁబడఁజాలవు. స్వగతములద్వారా వాటిని వెల్లడింపవలసియున్నది కదా. ఏకకాలగతమైన అనేకులయొక్క బాహ్యాభ్యంతరప్రవృత్తులను గవి వరుసగా వ్రాయవలసియున్నదేగాని ఒకేమాఱు వ్రాయఁజాలఁడు కదా. ఎప్పుడైతే ఉన్నదున్నట్లుగా వ్రాయుటకుఁ గుదరదో అప్పుడు కవి ప్రకృతిని నతిక్రమించవలసియున్నది. కేవలముగాఁ బ్రకృతినిమించి వ్రాయుట ప్రయోజనము లేదు. అట్లు వ్రాయుటకును రాదు. అందువలనఁ గావ్యము ప్రకృతిననుసరించినట్లే పోవుచుండవలెను. ప్రకృతిని మీఱుచుండవలెను.

పలుకులు, చేష్టలు, భావములు అసభ్యముగాకుండ వ్రాయవలసియున్నందున, నుదారభావములు చేకూర్పవలసియున్నందున వాటియొక్క ఉచితానుచితములను గవి విమర్శింపవలసియున్నది కదా. ఇందుకై శాస్త్రజ్ఞానమును, లోకజ్ఞానమును గవి సంపాదింపవలసియున్నది. కవిత్వమనునది సహజముగనే పుట్టవలయును. సహజముగఁ బుట్టునదియే రాణించును. అయినను శాస్త్రలోకజ్ఞానములుగల్గి పండితుఁడైనకవి శబ్దపుష్టి, భావపుష్టిగల్గి లోకమందు మిక్కిలిగా రాణించును.

కావ్యములు (దృశ్యశ్రవ్యకావ్యములు) సహజము కానందునను, కేవలముగా నసహజత్వమున నుండకూడనందునను ఘనులైనకవులు అనేకవిధములుగాఁ బదములను బ్రయోగించి అర్థగాంభీర్యము గల్గించియున్నారు. లోకప్రసిద్ధమైన విషయములను గ్రహించి అలంకారములను గూర్చి సొబగుఁ గూర్చియున్నారు. ఉత్కృష్టభావములు వెదచల్లి ఉత్కృష్టతను సాధించినారు. కథనునిమిత్తముగఁ దీసికొని పదాలంకారభావముల యొక్క స్వారస్యమును వ్యక్తపఱచి తన్మూలమున లోకహితమును లేక

ప్రమోదమును సాధించియున్నారు. కావుననే అసహజమైన విషయము లనేకముగానున్నను కావ్యములు రసవంతమగుచున్నవి.

సినీమాలలోఁ బాత్రకనఁబడకపోయినను నాపాత్రమాటలు వినిపించుచుండును. ఇందువలన నాసమయములోఁ బరికింపవలసియున్న ఇతర ప్రవృత్తి మనకు వ్యక్తమగుచుండును. మఱియు దారిపాట వినిపించుచుండును. (యతియో, బిచ్చగాఁడో తనదారినిఁబోవుచుఁ బాడుకొనుచుండును.) అది తత్కాలసంఘటనమునకుఁ బ్రయోజనమగుచుండును. వెనుకపాట (బ్యాక్‌గ్రౌండుమ్యూజిక్) వినఁబడుచుండును. అది తత్కాలమందలి సంతోషవిషాదపరిస్థితులకు దోహదమొనరించుచుండును. అశ్లే జనాంతికములు రంగమందు నూతనపరిస్థితినిఁ గలిగించును. స్వగతములు మనోవృత్తములను వ్యక్తముచేయును. చిన్నచిన్నపదములయొక్క కూడిక ఒకొక్కప్పుడును, దీర్ఘసమాసము లొకొక్కప్పుడును రసపుష్టి గలిగించుచుండును. శ్లేష కొన్నిసమయములలో నాహ్లాదమునుగూర్చును. *శబ్దార్థాలంకారములు సదా మనోల్లాసమును గూర్చుచుండును. మెల్లగను, గంభీరముగను, నింపాదిగాను, తొందరగాను పలుకుమాటలు వణఁకింపుమాటలు, సూటియగుమాటలు ఆయాపట్టులందు రసవంతములగుచుండును. రెండుమూఁడుపర్యాయములు మఱియు పదేపదే ఉచ్చరించుపదములు ఒక్కొక్కప్పుడు విశేషమైన భావమును వ్యక్తపఱచును. వృత్తములలోఁ జదివినను, పాటలలోఁబాడినను హాయిహాయి అనిపించుచుండును. పూజ్యులందు ఏకవచనము లున్నను, అనవసరసంబోధనలుండినను రాణించుచుండును. ఇన్ని అసహజమైన సంగతులతోఁగూడియున్నను గావ్యములు లోకమున కాహ్లాదము గలిగించుచున్నవి. హితమునుబోధించుచున్నవి. కావుననే కవులు నిరంకుశులని లోకప్రఖ్యాతి గల్గినది.

---

* శబ్దప్రయోగమాధుర్యమంతయుఁ శబ్దాలంకారములు. అర్థగాంభీర్యమంతయు నర్థాలంకారములు. కవి యుత్కృష్టుఁడైనకొలఁది వీటియందుఁ బ్రజ్ఞ మిక్కిలిగాఁ గల్గియుండును. భారతదేశకవులందఱు నీశబ్దార్థాలంకారములను రచించుటలోఁ దమఘనతను జూపియున్నారు. ముఖ్యముగాఁ బ్రబంధకవు లిందు విశేషశ్రద్ధవహించిరి.

ఎందఱెందఱెన్నెన్నివిధములఁ జక్కనికావ్యములు వ్రాసినను, సంస్కృతవాఙ్మయమును దేశభాషలలోని కెన్నివిధములఁ బరివర్తించినను, సంస్కృతవాఙ్మయమున కున్నఘనత తఱుఁగదు. ప్రపంచమం దన్నిదేశములవారు ఆభాషావాఙ్మయస్వారస్యమును జవిచూచి అందుఁ బూర్ణముగ నాసక్తు లగుచున్నారు. సంస్కృతవాఙ్మయమం దుత్కృష్టస్థానమును బొందియున్న పురాణేతిహాసములఘనత కొంచెమైనను దగ్గదు. పురాణపురుషుఁడైన వేదపురుషుఁ డావాఙ్మయమం దన్నిచోట్ల నిండియుండుటచేతనే ఆవాఙ్మయమున కాఘనత గల్గినది. వాటియందున్న రుక్మిణీకల్యాణాదులు ఇహపరశ్రేయస్సాధకము లైయున్నవి. భారతీయులు ముఖ్యముగా వాటిని సదాస్మరించుచు తరించుచుందురుగాక.

సీ. మునికృతమగు నిష్టిఁ బొలుపొంద జననంబు జనకసవనభూమి జననమాట
దశరథజీవమై తగనగ్రజాతంబు జనకాసువై పెద్దతనయయాటఁ
బ్రాకటంబైనట్టి యేకపత్నీత్వంబు ఘనపతివ్రతలందు ఘనతఁగనుట
సకలవిశ్వంభరప్రకటాధిపత్యంబు బ్రహ్మాండమునకెల్ల రాణియగుట
గీ. నవనిఁ *బితృవాక్యపరిపాలనానుసరణి, శుద్ధసకలాంగసౌందర్య శోభలొప్ప
ప్రణుత జానకీరామ దాంపత్యమహిమ, ప్రోచుఁగావుత భువినెల్లఁ బూర్ణముగను.

శ్రీకృష్ణార్పణమస్తు.

---

* 'ఇయంసీతా' అను రామాయణశ్లోకములో 'సహధర్మచరీతవ' అని జనకుఁడు పలికియున్నాఁడు. ఆప్రకారము సీతాదేవి పితృవాక్యపరిపాలన మొనరించియున్నది. శ్రీరాముఁడు పితృవాక్యపరిపాలన మొనరించినవాఁడేకదా.

---

చెన్నపురి : 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.